శ్రీరస్తు

# నిరంకుశోపాఖ్యానము

## సుధాతరంగిణీవ్యాఖ్యానసమేతము

### చతుర్థాశ్వాసము

క. శ్రీరమణీరమణీయప, రీరంభస్నేహవిస్ఫు ♦ రితసాయక ని
ర్దారితసుమనస్సాయక, భూరికృపావేశ కంద ♦ పురసోమేశా. 1

అ॥ శ్రీరమ......సాయక, శ్రీరమణీ — లక్ష్మీదేవియొక్క, రమణీయ — సుందరమైన, పరిరంభ — ఆలింగనముతోఁగూడిన, 'ని. పరిరంభః. పరీరంభః. అ. పు. కౌఁగిలి' శ. రూ. ర. స్నేహ — ప్రేమచేత, విస్ఫురిత — చలింపఁబడిన విష్ణువే, సాయక — బాణముగాఁగలవాఁడా, నిర్దారితసుమనస్సాయక. నిర్దారిత — చక్కఁగా ఛేదింపఁబడిన, 'ని. దారితే భిన్న భేదితౌ' అ. సుమనః + సాయక — పుష్పములే బాణములుగాఁగల మన్మథుఁడుగలవాఁడా, 'ని. స్త్రియః సుమనసః పుష్పం. ప్రసూనం కుసుమమ్ సుమమ్' అ. 'శరేఖడ్గేచసాయకః' అ. భూరికృపావేశ — భూరి — విస్తారమయిన, కృపా — దయతోఁగూడిన, ఆవేశ — మైమఱచుటకలవాఁడా, కందపురసోమేశా — కందుకూరనుపట్టణమునఁగల యో సోమేశ్వరస్వామీ, అని యాశ్వాసాదియందుఁ గృతిపతికి సంబోధనము. ఇందు లక్ష్మీదేవియందనురాగముగల విష్ణువు శివునకు హస్తగతుఁడై యుండెనుటచేత పరికరాలంకారము. "క. సాకూతములై సఫలత, చేకొన్న విశేషణములు ♦ చెలఁగఁబరికరం, బై కృతుల వెలయుచుండు" కా. సం. 'రమణీ రమణీయ' యమకాలంకారము. 'సాయక-సాయక-వేశ-సోమేశా' అంత్యానుప్రాసాలంకారము.

తా॥ సంపద్వ్యక్తియగు లక్ష్మీదేవియొక్క యాలింగనమునంగిచ్చగల విష్ణుమూర్తియే బాణముగాఁగలవాఁడవును, మన్మథుని సంహరించినవాఁడవును, అధిక దయామయుఁడవును, అయిన యో కందుకూరు సోమేశ్వరస్వామీ.

తే॥ అవధరింపుము తత్త్వవి ♦ ద్యావివేక, దళితకామాదిరిపువర్గ ♦ కలహుఁడైన
పులహుఁ డిట్లని పల్కె నా ♦ భూవరేణ్య, శేఖరునితోడ వాక్యవై ♦ చిత్రిమెఱయ. 2

అ॥ అవధరింపుము — వినుము, తత్త్వ......హుఁడు. తత్త్వవిద్యా — వేదాంతశాస్త్రమునందలి, వివేక — జ్ఞానముచేత, దళిత — భేదించఁబడిన, కామాది — కామముమొదలగు, రిపువర్గ — అరిషడ్వర్గముయొక్క, అనఁగాఁ గామ క్రోధ లోభ మోహ మదమత్సరములయొక్క యనుట. కలహుఁడు — పరస్పర వివాదముగలవాఁడు, 'ని. అ స్త్రియాం సమరానీకరణాః కలహవిగ్రహౌ' అ.

ఐన పులహుండు — అయినటువంటి పులహుండను నామధేయముగల బ్రహ్మ, ఆ భూవరేణ్యశేఖరుని తోడన్ — రాజులలో శ్రేష్ఠుండయిన యాధర్మశీలునితో, వాక్యవైచిత్రి మెఱయన్. వాక్య—మాటల యొక్క, వైచిత్రి — ఆశ్చర్యము, మెఱయన్ — ప్రకాశించుచుండఁగా, ఇట్లని — ఈవిూఁద జెప్పెడువిధముగా, పల్కెన్ — చెప్పెను, ఇందు 'కలహుండు — పులహుండు, అనుప్రాసాలంకారము.

తా॥ వేదాంతవిద్యా జ్ఞానసమృద్ధిచేతఁ గామక్రోధ లోభమోహ మదమత్సరములను నరిషడ్వర్గమును జయించినవాఁడయిన పులహుండు శ్రేష్ఠుఁడయిన యాధర్మశీలభూపాలున కీవిధముగాఁ జెప్పనారంభించెను.

క॥ ఆరీతి నతఁడు దివిష, న్నారీతిలకంబుతోడ ♦ ననువుగ సురతా
పారవ్యాపారశ్రీ, పారగభావమున భ్రాంతి ♦ పడి వర్తిలుచున్.

అ॥ అతఁడు — ఆనిరంకుశుఁడు, ఆరీతిన్ — ఆప్రకారముగా, దివిషన్నారీతిలకంబుతోడన్ — దివిషన్నారీ — దేవతాస్త్రీలలో, తిలకంబుతోడన్ — ప్రకాశించుచున్నట్టి యాగంభతోఁగూడి, తిలకము శ్రేష్ఠవాచకము. అనువుగన్, తగినట్లుగా, సురతా......మునన్, సురత — సంభోగము యొక్క, అపార — ఆవలిదరిలేని — అంతములేని, వ్యాపార — ప్రవర్తనముయొక్క, శ్రీ-సంపదయొక్క పారగ — ఆవలిదరిఁజేర సంచరించునట్టి, తుదముట్టనడచునట్టి, భావమునన్ — అభిప్రాయముతో 'ని. భావః సత్తాభిభావాభిప్రాయచేష్టాత్మజన్మసు' అ. భ్రాంతిపడి — భ్రమించినవాఁడై, వర్తిలుచున్ — ప్రవర్తించుచు, ఇందు 'అపారవ్యాపారశ్రీపారగ' అని రేఫము పలుమారు చెప్పంబడుటచేత వృత్త్యనుప్రాసాలంకారము.

తా॥ ఆ నిరంకుశుఁడావిధముగా సురకాంతతోఁ గలసి తుదితెగని సంభోగవాంఛతోఁగూడిన భ్రమగలవాఁడై ప్రవర్తించుచు.

వ॥ ఒక్కనాఁడు తనతోఁ గ్రీడింపఁ ద్రిదివంబున నుండి వచ్చిన నయ్యచ్చరలేమ యుందానును విలాసార్థంబుగఁ బురంబు వెడలి.

అ॥ ఒక్కనాఁడు — ఒకదినమున, తనతోడన్ — తనతోఁగూడి, క్రీడింపన్ — విహరించుటకు, త్రిదివంబుననుండి — దేవలోకమునుండి, ఇచట నవర్ణకముగూర్చి "నూఁ ఉండిపదంబు హెంటుగున్ వలనకందువర్ణకమట్లు నవర్ణకంబునను" ప్రౌ. వ్యా ఉదా 'క. సనత్కుమారుఁడు మహికిం, జనుదెంచె బ్రహ్మలోకం, బుననుండి' భాగ వచ్చిన + అయ్యచ్చరలేమయున్ — ఏతెంచిన యా యప్సరోంగనయును, తానును — ఆనిరంకుశుఁడును, విలాసార్థంబుగన్ — స్త్రీపురుషులయొక్క శృంగారచేష్టల నిమిత్తము, 'ని. విలాసోహావభేదేస్యా. ల్లీలాయామపిపుంస్యయమ్' మే. 'అర్థోభిధేయ రైవస్తు ప్రయోజననివృత్తిషు' అ. పురంబువెడలి — ఆపట్టణమునుండి బయలుదేఱి,

# చతుర్థాశ్వాసము

## —: రంభానిరంకుశు లుద్యానవనమునకుం జేరుట :—

సీ॥ సరసీరుహానవీన ♦ తరసీధురసపాన, భసలసుందరగాన ♦ భాసమాన
మసమానసహకార ♦ లసమానఫలవార, సనమాదరశుమార ♦ సమదకీర
మవనాదరణదార ♦ పవనాలసవిహార, భవనాగవిస్ఫార ♦ భవ్యహార
మవమానలవదూర ♦ పవమానసంచార, భవమాంద్యవిస్తార ♦ ఫణివిహార

తే॥ మంచితవిహంగమము రాజ ♦ హంసచంచు, దళితఫలసారజలపూర ♦ మిళితఫలిత
కలితఘనశాలినవశాలి ♦ ఖండమండ, లావరణదీవ్యమాన ము ♦ ద్యాన మొకటి. 5

అ॥ సరసీ......మానము. సరసీరుహ — తామరపువ్వులయొక్క, నవీనతర — నూతనమయిన, క్రొత్తదియైన, సీధురస— మద్యమును, 'ని, మధ్వాసవో మాధవకో. మధుమాధ్వీకమద్యయోః, మైరేయ మాసవః సీధుః. మేదకో జగలః సమా' అ మధ్వాసవః-మాధవకః-మధు-మాధ్వీక. ఇవి మధుకపుష్పోద్భవమద్యమునకును, మైరేయం-ఆసవః-సీధుః. ఇవి యిక్షుశాకాదిజన్యమద్యమునకును, మేదకః-జగలః-ఇవి సురాకల్కమునకును, అర్థములు. ఇచట 'సీధుః-శీధుః' అని రెండురూపములు కలవు. 'ని. మదిరా మధు మైరేయం శీధుః కాదంబరీత్యిరా' ధనం. పాన — ఆస్వాదించుచున్న, భసల — తుమ్మెదల యొక్క, సుందరగాన — చక్కనిసంగీతముచేత, భాసమానము— ప్రకాశించుచున్నదానిని, అసమా... కీరము. అసమాన — సమానములేని, సహకార — మిక్కిలి పరిమళముగల తీయమామిడిచెట్లయందు 'ని. సహకారోఽతిసౌరభః' అ. లసమాన — ఒప్పుచున్న, ఫలవార — పండ్లయొక్క సమూహము చేత, సన్మాదర — సన్మానముతో సహితమయిన, శుమార — ఎల్లప్రాయముగల, సమదకీర — సంతోషముతోఁ గూడిన చిలుకలుగలదానిని, "ని. ముత్ప్రీతిః ప్రమదో హర్షః ప్రమోదామోదసమ్మదాః" అ. అవ...హారము. అవనాదరణ — అవనియందు గౌరవింపఁబడనిదయిన, అనఁగా నతిశయింపనిదైనయనుట. దార — చీల్చుచుండెడు, 'దౄ. విదారణే, ధాత్వ, పవన — వాయువువలన, అలస — మాంద్యముతోఁగూడిన స్వభావముతో, విహార — సంచరించుచున్నవారికి, భవన — ఇండ్లు గాఁగల, 'ని. భవనాగారమందిరమ్' అ. అగ — వృక్షములయొక్క, వ్యు. నగచ్ఛతీత్యగః. 'ని. శైల వృక్షానగావగౌ' అ. విస్ఫార — విశాలమయిన, భవ్య — శుభకరమయినట్టి, హారము- మనోహరమయినదానిని, వ్యు. 'హ్రియతే చిత్తమనేనహారః' అవ.....విహారము. అవమాన — తిరస్కరింపఁబడి, లవ — లేశములైన, తునకలయిన, దూర — దవ్వుగల, పవమాన — వాయువులయొక్క, 'ని. నభస్వద్వాత పవన పవమాన ప్రభంజనాః, అ. సంచార — తిరుగుటవలన, భవ — పుట్టిన, 'ని. భవ స్సత్తారుద్రగర్భ ప్రాప్తిసంసారజన్మసు' నానా. మాంద్య — జడత్వముచేత, విస్తార — ఎక్కువయైన, ఫణి — సర్పములయొక్క. 'ని. కుండలీ గూఢపాచ్చక్షుశ్శ్రవాః కాకోదరః ఫణీ' అ. విహారము — సంచారముగలదానిని, 'ని. విహారో భ్రమణేస్కంధే లీలాయాంసుగతాలయే' మే. అంచిత — ఒప్పుచున్న, విహంగమము — పక్షులుగలిగినదానిని, 'ని. ఖగేవిహంగ విహగ విహంగమ విహాయసః' అ. రాజ...మానము, రాజహంస — ఎఱ్ఱనికాళ్లును ముక్కును గలిగి తెల్లగానుండెడు రాయంచల యొక్క, "ని. రాజహంసస్తుతే చంచు చరణై ర్లోహితైస్సితాః" అ. చంచు — ముక్కులచేత, "ని., చంచుస్త్రోటిరుభే స్త్రియా" అ. దళిత — భేదించఁబడిన, ఫల — పండ్లయొక్క, సారజల—రసమనెడు

నీటియొక్క, "ని. సారోబలేస్థిరాంశేచ మజ్జిన్పుంసిజలేఘనే" . మే. పూర – ప్రవాహములతో, మిళిత – కూడినవై, ఫలిత – పండియున్న, 'ని. ఫలితా పక్వదారితా" నానా. కలిత – పొందఁబడిన, "ని. కలితం విదితాప్తయోః" విశ్వ. ఘనశాలి – గొప్పతనముతో నొప్పుచున్న, నవశాలి – నూతనము నైనవరిధాన్యములుగల, ఖండ – సగపాలుగల - అర్ధభాగములుగల, మండల – దేశముయొక్క, అనఁగాఁజతురస్రమైన భూమియొక్కయనుట. ఆవరణ – కట్టతోఁగూడియున్న దీవ్యమానము – బాగుగాఁబ్రకాశించుచున్న దానిని, ఉద్యానము – ఊరిదాపుననుండి సకలజనులకు భోగార్హమయిన తోట. "ని. పుమానాక్రీడ ఉద్యానం రాజ్ఞః సాధారణంవనమ్"అ. ఇచట నుద్యానమనుహల్లుకు ఉప్రత్యయమువచ్చినది. సూ. "స్యాదమహతాం విభక్త్యసోశ్చము" శబ్దవిం. ఒకటి – ఒకదానిని, ఇచట ద్వితీయకుఁబ్రథమ చెప్పఁబడుటకు 'సూ. ఇతరత్రచ ద్వితీయాతస్యాః ప్రథమాచజడపదానాంస్యాత్' నన్న. 'సూ. క్వచిదన్య విభక్త్యర్థే ప్రథమాః ప్రదృశ్యతే' అథ. ఈసీసపద్యపు ప్రతిపాదమునను నాలుగంత్యప్రాసములు గలుగఁజెప్పినాఁడు. ఎత్తుగీతియందు 'మిళిత-ఫలిత-కలిత' వృత్త్యనుప్రాసాలంకారము. 'ఘనశాలినవశాలి – ఫలసారజలపూర – దీవ్యమానముద్యానము, ఇవి యనుప్రాసాలంకారము.

తా॥ తామరపువ్వులనుండి యప్పుడే వెడలుచున్న మద్యమును బానముసేయుచున్న తుమ్మెదలయొక్క మాధుర్యములగు పాటలచేత నొప్పిదమైనదియును, సాటిలేని యధికపరిమళముగల తియ్యమామిడిచెట్లయందలి ఫలములను భుజించుచు సంతోషముతోనున్న చిలుకలగుంపులు గలదియును వృక్షాములతోదట్టమయిన దానియందెక్కువగాఁ జొరశక్యముగాక భేదించుకొనుచు వచ్చుచుండెడు వాయువులవలని మందగమనముతోఁ దత్ప్రదేశమున సంచరించువారలకు గృహాముపలెనుండి యానందమును గలిగించుచున్న గొప్పవృక్షములతో రమ్యమైనదియును, దూరమునుండి చిన్నచిన్నవిగావచ్చుచున్న చల్లనిగాడ్పుల వరుసలయొక్క గమనమువలన నేర్పడిన మాంద్యభావముచేత నతిశయించిన త్రాఁచుబాములయొక్క విహారము కలదియును, మధురఫలములు గల వృక్షములపైనుండిన రాజహంసలు పరిపక్వములయిన ఫలములను దమ ముక్కులతోఁబొడుచుచుండఁగా స్రవించి వాగులైపాఱుచుండెడు నీటివలనఁ దమకుఁదామె వృద్ధియై పండినవడ్లు గలిగి చుట్టును గట్టుతోనున్న పల్లపుభూమి సగపాలు గలదియును, అయి యలరారుచున్న భోగార్హమయిన యొక గ్రామసమీపవనమును.

తే॥ చూచి యచ్చోటిమహిమకుఁ ♦ జోద్యపడుచు,
ముమ్మరంబుగఁబూఁదేనె ♦ మునురు గురియ
నచ్చతర గుచ్ఛములమీఁద ♦ నళులు గ్రమ్మ,
దెప్పరంబగులేఁదీఁగె ♦ చప్పరమున. 6

అ॥ చూచి – కనుగొని, ఇచట రెండుపద్యములను గలిపి యన్వయించుటకు 'సూ. పద్యంబులకుఁ గులకంబగు' ప్రౌ. వ్యా. 'సూ. క్వచిత్కులక సంబంధోఽప్యత్రనాహితకృద్భవేత్, ఆఖ్యాహారస్య సంయోగ. స్త్వత్రైవ సుఖావహః' అథ. ఉదా "తానొకపండువెచ్చెరకన్" "కొనివచ్చెదు" భార, అచ్చోటిమహిమకున్ – ఆప్రదేశమునందలి గొప్పతనమునకు, చోద్యపడుచున్ – ఆశ్చర్యమును జెందుచు, ఇచట 'చోద్యపడుచు' అనుటకు 'సూ, ఆదంతపాదిశబ్దేషు ప్రత్యర్థేబిందు

లోపకా వర్ణకస్యాత్రకథితా క్వచిత్సుకవిసమ్మతేః' అథ. ముమ్మరంబుగన్ — అధికముగా, పూఁదేనె. పుష్పములయందుఁగల మధురరసముయొక్క, ఇచట 'పూఁదేనె' అనుటకు 'సూ. శబ్దానామాదిభాగేషు యాతనత్వాదిబోధకాః ఏకద్వివర్ణశబ్దాస్స్యు రర్థభేదేఽపిచక్వచిత్" అథ. ముసురు — ఎడతెగని వర్షము, కురియన్ — వర్షించఁగా, అచ్ఛతర — తెల్లనివయిన, గుచ్ఛములమీదన్ — పూగుత్తులపైన, అళులు — తుమ్మెదలు, క్రమ్మన్ — వ్యాపింపఁగా, దెప్పరంబు — అశక్యము, అగు లేఁదీఁగె — అయినట్టి లేఁతతీఁగలయొక్క, చప్పరమునన్ — చలిపందిరియందు, ఇందు 'అచ్ఛ గుచ్ఛ' అనుప్రాసాలంకారము. 'పూఁదేనెముసురుగురియ' ననుటచే నతిశయోక్త్యలంకారము.

తా॥ చూచి యచ్చటఁ గలవిశేషముల కచ్చెరువందుచు నెడతెగక కురియుచున్న పూఁదేనె సోనలకు పైఁపఁ జాలక తెల్లని పూఁగుత్తులమీఁద వ్యాపించిన తుమ్మెదలతో నతిశయించియున్న యొక లేఁతతీఁగెలుఁగల చలిపందిరియందు.

—: రంభా నిరంకుశుల సురతకేళీవర్ణనము :—

సీ॥ వదనచత్వర విసృ ♦ త్వరరసజ్ఞారవో, న్నిద్రతాదిక్కూల ♦ ముద్రుజంబుఁ
గనకకంకణఝణ ♦ త్కారసముత్పాత, పంచాంగుళప్రియం ♦ భావుకంబు
మధురాధరోష్ఠవ ♦ మంతాన్నిపీడనో, ద్ధత్యానుకంపామి ♦ తంపచంబు
సజ్ఞాతపూర్వర ♦ త్యైన్నత్య పునరుప, క్రమణయాచ్ఞావచో ♦ భ్రంలిహంబు
తే॥ గాఁగ సురతంబు నల్పి యం♦క్కమలముఖియు, నామహీసురసూనుండు♦ నంతఁ జాల
నలసి వలయితదివ్యాంబ♦రావృతాంగు, లగుచుఁ దమచేఁతలకుఁ దామె♦ నగుచునుండి. 7

అ॥ వదన...జంబున్. వదన — ముఖముయొక్క, చత్వర — ముంగిలియందు, "ని. చత్వరం స్థండిలేంగణే" విశ్వ. విసృత్వర — ప్రసరించుచున్న, "ని. విసృత్వరో విసృమరః ప్రసారీచ విసారిణి" అ. రస — అమృతమును, "ని. శృంగారముఖ్యమధురాది సువర్ణకేతో, నిర్యాస రాగ గరళ ద్రవ పారదేషు, ఆస్వాదనధ్వని సుధాంబురసాఖ్యధాతు, ష్విష్టో రసోఽధరసనా ధరణీ రసా స్యాత్" నావా. జ్ఞ — తెలియఁజేయఁజేయునట్టి, ఆరవ — రతికాలమునందు గొంతునఁ గలిగెడు గుబగుబ యను ధ్వనివలన, ఉన్నిద్రతా — మేలుకొనియుండుట, జాగరూకత గలిగియుండుట. ఇచట 'ఉన్నిద్రతా' అనుటకు 'సూ. త్వతలో ర్గుణవచనస్య, సిద్ధాం. వ్యా. శుక్లాయాభావః శుక్లత్వం. శుక్లతా. త్వ తలో రితి, త్వప్రత్యయే తల్ప్రత్యయే చ పరే గుణోపసర్జనద్రవ్యవాచినః పుంవత్త్వం వక్తవ్య మిత్యర్థః. దిక్కూలముద్రుజంబున్ — దిశలయొక్క దరులనొరయునదియును, అనఁగా దిగంతముల వఱకు [illegible] గల కంఠధ్వని యనుట. కూలముద్రుజ మనునది యేకపదము 'కూల ముద్రుజ తీతి కూలముద్రుజః' 'సూ. ఉది కూలే రుజి వహోః' ఇతిఖచో 'అరుర్ద్విష' దిత్యాది నాముమాగమః. 'ఉదా. కుర్వన్ సరిద్వారిసకూలముద్రుజమ్' రావ. "సరితాం కూలముద్రుజాః" రఘు. "దిక్కూలముద్రుజాటోపాః" ప్రతా. కనక......కంబున్. కనకకంకణ — సువర్ణమయమైన హస్తాభరణములయొక్క, ఝణత్కార — ఝణఝణయనెడి ధ్వని చేయుచు. సముత్పాత — పైనఁబడుచున్న, సం + ఉత్ + పాత — సముత్పాత. అని తెలియవలెను. పంచాంగుళ — హస్తములయొక్క, ప్రియంభావుకంబున్ — ఇష్టమును గలుగఁజేయు

చున్నదియును, అనఁగా నొండొరులపై హస్తము లుంచఁబడుచున్నయట్టి సుధ......చంబుల్. ... తియ్యనైన, అధరోష్ఠ — క్రిందిపెదవియొక్క, సమంతాత్ — అంతయును, నిపీడన — బాగ ... అన్న, అనఁగా నధరామృతపానము సేయుచున్నయనుట, ఔద్ధత్య — మదించినతనముచేతను, అతి ... చేతను, అనుకంపా — దయచేతను, మితంపచంబుల్ — మితిగాఁకల్యమైనట్టియును, ఇచట 'ఏకస్పచ' శబ్దమునుగూర్చి 'సూ. పరిమాణేపచః' 'మితనఖేచ' సి. కౌ. "ఉదా. ప్రోణంపచాస్తత్ర ... " రాఘ. అజ్ఞా......లిహంబుల్. అజ్ఞాత — అల్పముగాఁ దెలియఁబడిన, "తత్సా దృశ్యమభావశ్చ తదన్యత్వం తదల్పతా, అప్రశస్తి ర్విరోధశ్చ నఞర్థాః షట్ప్రకీర్తితాః" పూర్వాతి — ప్రథమసంభోగముయొక్క, ఔన్నత్య — అధికముచేత, అనఁగా మొదటికలయిక బొత్తిగాఁ దెలియకుండుటచే ననియర్థము. పునరుపక్రమణ — మరల నారంభించుటకు, యాచ్ఞా — అడుగుటయనెడు, వచో — వాక్యములయొక్క, అభ్రంలిహంబుల్ — ఆకాశము నాస్వాదించుట కలిగినట్టియును, అనఁగాఁ బునస్సంగమమునకుఁ బ్రార్థించుచున్న మాటలయొక్క ధ్వని యాకసము నంటుచున్నదనుట. కాఁగన్ — అగునట్లుగా, సురతంబుసల్పి — సంపర్కము చేసి, అక్కమలముఖియున్ — పద్మమువంటిముఖము గలదయిన యారంభయును, ఇచట 'అక్కమలముఖి' అనుచోట "సూ. ఇదమదసేతద్వ్యతచ్ఛబ్దాశ్చద్విస్త్రాన్వయే బహుశంప్రహస్వం ప్రపద్య దీర్ఘాద్విత్వముపర్యక్షరస్యజనయంతి" నన్న. "ఊష్మరేఫాన్వినా ద్విత్వమయుక్తస్యహలోమతః, ఋకారంచవిముచ్యస్యా ప్రాప్తేణానాంద్విత్వసంగతిః" అథ. ఆమహీసుర తనయుండున్ — బ్రాహ్మణునికొడుకయిన యానిరంకుశుఁడును, అంతన్ — అంతట, చాలన్ + అలసి — ఎక్కువగా బడలినవారై, వల......గులు. వలయిత — చుట్టును జుట్టఁబడిన, దివ్యాంబర — మనోహరమయిన వస్త్రములచేత, ఆవృత — ఆవరింపఁబడిన, చుట్టుకొనఁబడిన, అంగులు — శరీరము గలవారు, అగుచున్ — అయి, తమచేఁతలకున్ — ఆయిరువురు చేసినపనులకు, తామె — వారంతట వారే, నగుచునుండి — నవ్వుకొనుచునుండి, ఇందు 'వదన...జంబు' 'పునరుప...లిహంబు' అనుక్తవిషయస్వరూపోత్ప్రేక్ష. "క. ఫలతను హేతుత వస్తుత, నలరెడు సంభావనంబు లగు నుత్ప్రేక్షల్, తొలిరెండును సదసద్విష; యలు కథితాకథితవిషయ యంతిమయు నగున్" అలం. సా. సం. ఈపద్యమంత్యానుప్రాసముతోఁ జెప్పఁబడినది. ఉదాత్తాలంకారమును. "ఉదాత్తం వస్తుతః సంపత్, మహతాం చోపలక్షణమ్" కా. ప్ర. 'ఉత్సాహభావమును. క. అత్యున్నతలోకోత్తర, కృత్యంబులు సేయవేఁడి కృతకృత్యు విలన్, నిత్యముఁ దలఁచు ప్రయత్నం, బత్యంతోత్సాహ మయ్యె" కా. సం. "వదన...జంబు" ఇత్యాదులచే సంభోగావస్థ వర్ణింపఁబడియున్నది. "అనుకూలే నిషేవేతే. యత్రాన్యోన్యం విలాసినౌ, దర్శనస్పర్శనాదీని స సంభోగఉదాహృతః" ఉదా. త్వం ముగ్ధాక్షి వినైవ కంచులికయా ధత్సే మనోహారిణీం, లక్ష్మి మిత్యభిధాయిని ప్రియతమే తద్వీటికాసంస్పృశి, శయ్యోపాంతనివిష్టసస్మితముఖీనేత్రోత్సవానందితో, నిర్యాతః శనకై రలీకవచనోపన్యాస మాలీజనః" అమరు. "గాఢాలింగన పీడనస్తనతటంస్విద్యత్కపోలస్థలం, సందష్టాధరముక్తసీత్కృత మభిభ్రాంతభ్రుస్నృత్యత్కరం, చాటుప్రాయవచో విచిత్రమణితం ఘాతైరుతైశ్చాంకిత, వేశ్యానాంధృతిధామపుష్పధనుషః ప్రాప్నోతి ధన్యోరతమ్" శృం. తి. రంభానిరంకుశులు సంభోగముచే నలసియుండి రనుటకుదా. "మహాస్రగ్ధర. ఒకనాఁ డా ప్రామాంకురోఘం బురుకుసుమకుడుం గోదరశ్రోణితల్ప, ప్రకరంబై కాంత్రుచేముం స్వత్తులఁ బదరిపైఁ ప్రాఢివాటించినిట్లా, ర్పకవొట్టన్ డస్సి వీరా యితమరిమటితా రెట్లొమున్నట్లయ్యా నా యికలం గందర్ప డోటం బెటేఁగితమివీఁ వేసెనానంటితోటన్" ఆము. మఱియు

"ఈషత్కంపపయోధరం గురుకటీ ప్రాంత ప్రహారాద్భుతం, స్విద్యద్గాత్రలతానేక హాస్యసరసం పంకేరుహాక్ష్యా విదం, వారంవారమియః ప్రహారసుభగం సంసిద్ధనైపుణ్యసాధకం, కించిద్ధ్వస్తనితంబదేశనఖరం ధన్యోరతం సేవతే" శాఙ్గ. ఈపద్యము పెద్దనామాత్యుని "సీ. సహసాసముత్పన్న సదస్త్ర పరిరంభ" యను పద్యము వలె నుండలేదని యొకరనిరి. శ్రీనాథుని "సీ. పతిపాణిపల్లవ♦చ్యుతనీవిబంధన, స్త్రీశ్రీ నీలా హస్త♦ పరిహాసము" అనుపద్యము ననుసరించియే యొక్కసారి విసరకును. పెద్దన్నగారును, ఆంధ్రకవిత్వాగ్రేసరాదికవులును ఒకొక్కొక్క సీసమును రచించినవారని లోకవిదితము. ఇందుచేతనే యాశ్వాసమున 61 వ పద్యమును జూచినచో యీకవియొక్కటి రసపుష్టిముగా వ్రాయఁగలిగెనని మనముఁ దెలిసికొనుచున్నది.

తా॥ ముఖమునుండి వ్యాపించుచున్న యుచ్ఛ్వాసమును దెలియఁజేయుచున్న రతికాలమున గొంతునఁ గలిగెడు గుబగుబధ్వనివలన జాగరూకత వహించియున్న దిగంతములు గలదియును, కాంచనమయము లగు హస్తాభరణములయొక్క ఝణఝణయనెడు ధ్వనులతో నొండొరులపైఁ బడుచున్న హస్తములవలన స్నేహమును బుట్టించుచున్నదియును, తీయని యధరామృతపానము నెక్కువగాఁ జేయుటవలనఁ గనికరముతోఁ గూడి మిక్కిలి పక్వమైన మోవిగలదియును, ప్రథమసంభోగాతిశయము బాగుగాఁ దెలియకయుండుటచేత మరల నారంభించుటకుఁ బ్రార్థించుచున్న పలుకులయొక్క ధ్వని యాకసము నంటుచున్నదియును, అయిన సంభోగమునుజేసి యానంథయును నిరంతరసుఁడును జాలశ్రమ నొంది యందమైన తమవస్త్రములను మొలచుట్టుఁ జుట్టుకొని యాయిరువురు చేసినపనులకుఁ దమలోఁ దామే నవ్వుకొనుచుండిరి.

ఉ॥ జారినకుంతలంబులు పొ♦సంగఁగదువ్వుచుఁ జల్వపయ్యెదన్
దోరపుఘర్మబిందువులు♦ దూలఁగ వీవుచు వీడియంపుఁ గ
ర్పూరపువాసనల్ దిశలఁ♦ బొల్పడ నించి మనోభవాహవో
దారకళావిశారదుఁడ♦ వౌదువురా యని తన్ను మెచ్చుచోన్ 8

అ॥ జారినకుంతలంబులు — ముడివీడినతలవెండ్రుకలు, 'ని. చికురః కుంతలోవాలః కచః కేశః శిరోరుహః' అమ. పొసంగఁగన్ — ఒప్పునట్లుగా, దువ్వుచున్ — నున్నఁగాదువ్వికొనుచు, చల్వపయ్యెదన్ — ధౌతవస్త్రముయొక్క మైజారును, తోరపుఘర్మబిందువులు — అధికమయిన చెమటబొట్లు, 'ని. ఘర్మోనిదాఘః స్వేదః' అ. తూలఁగన్ — చలించునట్లు, వీవుచున్ — విసరికొనుచు, అనఁగాఁజెమటయారునట్లు విసరికొనుచుననుట, వీడియంపుఁ గర్పూరపువాసనల్ — తాంబూలముయొక్క కప్పురముతోఁగూడిన పరిమళము, ఇచట 'వీడియంపుఁగర్పూరపు' అనుచోట్లఁ బుగాగమమును గూర్చి ."సూ. సామానాధికరణ్యేతు ♦ బహుత్వాక్షేపకేఽపిచ, మువ్వోర్బవేతాం ప్రంప్వాఖ్యావాదేశావక్రోసర్వదా' అథ. దిశలన్ — దిక్కులయందు, పొల్పడన్ — వ్యాపింపఁగా, నించి — నిండింపఁజేసి, మనో......దవు. మనోభవ + ఆహవ — మన్మథునియొక్క సంగరమునందు — సంభోగమునందు, ఉదార — అధికమయిన, 'ని. ఉదారోదాతృమహతో' అ. ఉదా. 'ఉదారంమతయః' సం. బిల్హ. 'ఉదారకీర్తేః' కిరా. కళా — విద్యయందు, 'ని కలా స్యాన్మూలరై వృద్ధౌశిల్పాదా వంశ

మాత్రకే? మే. వికాసమందవు — చేస్పెదివి, కామపురా — అయియున్నావు సుమా, అని — ఇట్లుపలు కుచు, తన్నున్ — అతనిని, మచ్చరోక్తిన్ — గ్రసింపనున్న సమయమున. ఇందు మొదటిపాదమున 'జాలిన' అనుపదము శ్లేషముగా నున్నది కొందఱు దీనిని శకటరేఫముగా వ్రాయుచున్నను ఈగ్రంథ కర్త రెండురూపములతో నిష్పత్తియునుఁ బ్రయోగించిన ట్లూహింపవలసి యున్నది. (స్వ 21-69చూ) 'ని. జాఱు — పలాయితుఁడవు, ముడివీడు. కాలైను మాలైనను జాఱు నిశ్శ్రుజాఱు' ఆం. దీ. 'జాఱు— పలాయితుఁడవు' ఆం. దీ. ఆంధ్రపదపారిజాతము మున్నగు నిఘంటువులయం దీరెండురూపములు కన్పట్టుచున్నవి. 'ని. జాఱు (క్రి. జాఱు) గళితము, జాఱుట. పలాయనమగుట. వదలిపోవుట. 'జాఱు ముడి. కేశబంధవిశేషము' ఆం. ప. పా. "ని. జాఱు. పలాయితుఁడవు. ముడిపీడు' శ. ప. పా. ఉదా. 'వ. జాఱు కొప్పులం దొరఁగువిరిగుత్తులతో' వసు. వ్యా. జాఱు......రంగు, జాఱుకొప్పులం దొరఁగు — జాఱుసిగలవల్లనుండి రాలుచున్న, చతు. 23. 'మ. తన్నులమాత్రంబులు వ్రాక తుంపురులుగా జాఱన్' వసు. వ్యా. తుంపురులుగాజాఱన్ — శీకరములుగా జాఱను, మంచో యనన్ — హిమమా యనునట్లుగా జాఱనని సంబంధము. (వసు. 93 పు) మఱియు నాలుగవపాదమున 'ఉదాత్త' శబ్దము నందలి 'ఆ, వర్ణమునకును 'జా' వర్ణమునకును యతి చెప్పఁబడినది. దీనిని నిత్యసమాసయతి యందురు. 'తే. పదము విభజించి చెప్పఁగా ♦ స్పష్టనియమమును, నవ్యశబ్దంబుఁ గాని విగ్ర♦హంబుఁ జెప్ప, నదియె నిత్యసమాసమై ♦ యతులఁ గృతుల, నంటి సంధిలిపచ్చహా ♦ ర్లమునవింతి' సులు. ఈపద్యమును 'మెచ్చుచోన్' అనుటకుదా. 'ఋ. శిరము చోచ్చినామపాదంబునన్, నోలఁగంట్రోచ లతాంగి' పాం. 'సీ. దేవిఁ గాఁ బ్రీతితోఁ జని సేఁగాంచితి, ననియున్న చోవిభా♦త్రుసము నిచ్చి, పాడిమువిఘున్నమా♦పాలింప' భార. స్వభావోక్త్యలంకారము 'స్వభావోక్తిస్సౌ చారుయథావస్తువర్ణనమ్' ప్రతా.

తా॥ సంభోగకాలమున ముడివీడినశిరోజములు చక్కఁగా ముప్పుకొనుచు ముసిఁడిచే పయ్యెదతో నొడలిచెమ్మటచుక్కలు లాఱునట్లు విసరికొనుచు, తాంబూలముయొక్క సువాసన దిశలయం దంతటను వ్యాపింపఁగా నతనితో నుంతవిద్యయందుఁ జాతుర్యముగలవాఁడవు నీతో నెవ్వరు సరిరా రని పొగడుచున్న సమయమున.

## —: నిరంకుశుఁడు నారదునింగాంచి రంభతోఁ బ్రశ్నించుట :—

వ॥ యథేచ్ఛగా నభోమార్గమునం జనునారదునింగాంచి యాచిగురుఁబోఁడి కతం డిట్లనియె. 9

అ॥ యథేచ్ఛగాన్ — ఇష్టమువచ్చినట్లుగా, 'యథాసాదృశ్య, ఇత్యవ్యయీభావః' 'ని. ఇచ్ఛాకాంక్షాస్పృహేహాతృడ్వాంఛాలిప్సామనోరథః' అ. నభోమార్గంబునన్ — ఆకాశపథమున, చను నారదున్ — పోవుచున్న నారదుఁ డను మహర్షిని, కాంచి — చూచి, అతండు — ఆనిరంకుశుఁడు, ఆచిగురుఁబోఁడికిన్ — ఆదేవవేశ్యతో, ఇచట 'చిగురుఁబోఁడి' అనుటకు 'సూ. అలయఁబోఁడిత్యాదు లుపమాన పూర్వపదకర్మధారయంబులు' ప్రౌ. వ్యా. ఉదా 'మ. చిగురుంబోఁడి యెఱుంగుదే' కళా. ఇట్లనియెన్ — ఈచెప్పఁబోవుతీరునఁ బలికెను, ఇందు 'ఆచిగురుఁబోఁడికతండిట్లనియె' అనుచోట షష్ఠీవిభక్తియగుటకు "సూ. షష్ఠీస్థానికంబగు కువర్ణకంబొక్కొకచో ద్వితీయాది విభక్త్యర్థములనుమాఱుగా. వర్తదర్థంబులం జూపట్టెడి' ప్రౌ. వ్యా. ఉదా 'అంగపతికెదిరించెన్' కళా.

సీ॥ కారుణ్యరసవృష్టిఁ ♦ గమనీయతనుయష్టి, చిగిరించె నా జటా ♦ శ్రీ దలిర్ప
నమృతఘనీభావ ♦ మనఁగ నొప్పువిభూతి, ధవళితాంగము కీచి ♦ దివిఁ జెలంగ
హస్తాంబుజంబుపై ♦ నానుపూర్వ్యపరంపర నాఁగ రుద్రాక్ష ♦ మాల తనర
సముదంచితానంద ♦ జలధి ఘూర్ణిలుమాడ్కి, మారుతాహతిచేత ♦ మహతి మ్రోయ
తే. ప్రకటతేజో విశేషంబు ♦ బాలసూర్య, సృష్టిగావింప నయనసం ♦ తుష్టి గాఁగ
నరుగుదెంచుచున్నవాఁ ♦ డభ్రవీథి, నీతఁ డెవ్వాఁడు దివిజపూ ♦ ర్ణేందువదన. 10

అ॥ దివిజపూర్ణేందువదన — నిండుచందమామవంటి మోముగల యో దేవలోకకాంతా, కారుణ్యరసవృష్టిన్, దయారసముయొక్క వర్షముచేత, దయయనెడు జలముచేత ననియుఁ జెప్పవచ్చును. ఇచట 'కారుణ్యరస' మనుటకుఁ బ్రా. "సీ. కరుణారసముపొంగి తొరఁగెనో నాఁ బ్రసన్న, శశిరేఖనమృతంబు జాలు వాఱ" భార. రసశబ్దమునుగూర్చి 'ని. శృంగారాదౌ విషే వీర్యే, గుణే రాగే ద్రవే రసః' ధనం. "గుణేరాగే ద్రవే రసః" యాద. కమనీయతనుయష్టి — ఇంపైన దండమువంటి దేహము, అనఁగా కఱ్ఱవంటి మేనును. చిగిరించెనాన్ — పల్లవించెనేమో యనునట్లు జటాశ్రీ — జడలయొక్క సంపద, తలిర్పన్ — అతిశయించగా, అమృతఘనీభావము — సుధయొక్క గడ్డకట్టుట, అనఁగన్ — అనునట్లుగా, ఇచట అమృతశబ్దమునుగూర్చి 'ని. పీయూష మమృతం సుధా' అ. ఒప్పువిభూతి — ప్రకాశించుచున్న భస్మముచేత, ధవళిత — తెల్లనయియున్న, అంగము కీచి — శరీరముయొక్క కాంతి, దివిన్ — ఆకాశమునందు, చెలంగన్ — ఒప్పఁగా, హస్తాంబుజంబుపైన్ — తామర పూవువంటి చేతిమీఁద, ఆనుపూర్వ్యపరంపర — వర్తించుచున్న తుమ్మెదలయొక్క పరంపరయో నాఁగన్ — అనునట్లు, రుద్రాక్షమాల — రుద్రాక్షలతోఁ గూర్చిన జపమాలిక, తనరన్ — ప్రకాశించఁగా, సముదంచితానందజలధి, సముదంచిత — ఒప్పుచున్న, ఆనందజలధి — సంతోషమనెడుసముద్రము, ఘూర్ణిలుమాడ్కిన్ — ధ్వనిచేయుటవలె, అనఁగా సముద్రపు మ్రోఁతవలె ననుట. మారుతాహతిచేతన్ — వాయువులయొక్క తాఁకుడుచేత, మహతి — సూక్ష్మతంత్రులు గలదయిన తనయొక్క వీణ, 'ని. వీణాభేదే౽పి మహతీ' అ. మ్రోయన్ — మ్రోగుచుండఁగా, ఇచట నారదునివీణ మహతియనుటకు 'ని. విశ్వావసో౽స్తు బృహతీ. తుంబురో౽స్తు కళావతీ, మహతీ నారదస్య స్యాత్, సరస్వత్యాస్తు కచ్ఛపీ' వైజ. ప్రకటతేజోవిశేషంబు. ప్రకట — స్పష్టమయిన, తేజోవిశేషంబు — దీప్తియొక్క యతిశయము, బాలసూర్యసృష్టిగావింపన్. బాలసూర్య .. ఉదయించుచున్నట్టి సూర్యునియొక్క, సృష్టి — పుట్టుకను, కావింపన్ — కలుగఁజేయఁగా, నయనసంతుష్టి నయన — కన్నులకు, సంతుష్టి — ఆనందము, కాఁగన్ — కలుగఁగా, అభ్రవీథిన్ — ఆకాశమార్గమున, 'ని. ద్యోదివౌ ద్వే స్త్రియామభ్రం వ్యోమపుష్కరమంబరమ్' అ. అరుగుదెంచుచున్నవాఁడు — వచ్చుచున్నవాఁడు, ఈతఁ డెవ్వాఁడు — ఈపురుషుఁ డెవఁడైయుండును, ఇచట 'ఈతఁడు' విశేష్యము ఉద్దేశ్యము 'ఎవ్వాఁడు' విధేయము. 'సూ. ఉద్దేశ్యవిధేయభిన్నంబు విషయంబు' ప్రౌ. వ్యా. 'ప్రకటతేజోవిశేషంబు బాలసూర్యసృష్టిగావింప' ఉపమాలంకారము. పద్యమంతయు నుత్ప్రేక్షాలంకారము. "సంభావనమథోత్ప్రేక్షా ప్రకృతస్య సమేనయత్" కా. ప్ర. 'ఆనందజలధి-హస్తాంబుజము' రూపకాలంకారము. 'వృష్టి యష్టి' అనుప్రాసాలంకారము.

ప్రకారత్వమును, చూపఁగాన్ — కనపఱచుట, తగునె — చెల్లునా, చెల్లదనుట, ఇంక 'ఉండినయుండనీ' అను ప్రయోగమునకు 'సూ. ప్రార్థనాదులం దప్రత్యయాంతక్రియలవిధ్యర్థముల కీకారంబు విభాషనగు' ప్రౌఢవ్యా. ఉదా. 'మ. మునిధర్మంబులకెల్లవ ప్పని జనంబుల్ నవ్వినన్ నవ్వనీ' కళా. 'సూ పునరుక్తిర్నిరాకరణాద్యర్థేష్వాత్మనేపదే చిత్తైకార్థకాత్' అధ. 'ఉండినయుండనీ - గాకమాకయో... కేవలాలయై, అనుప్రాసాలంకారము.

తా॥ భోగలాలసులై యిట్లని చెంతనుండినవారు నె. దుష్కార్యమనిన నిదియేకదా! ఇంతటనైనను దుర్బుద్ధిగలవ యమలోకనిందను బొందక మావంటి మహాత్ములను నమస్కరింపగూడదా! పాపము దీనిగతి యేమికానున్నదో అదియును వాఁడును వచ్చు మహాత్ముల మగు మావంటివారియెదుట తమ చెడుబుద్ధి విశదమగునట్లు కపటకృత్యములతోఁ బ్రవర్తింపఁ దగునా.

## —: నారదుఁడు దేవలోకమున కేగుట :—

శా॥ కానీ దీనికిఁగా నొకానొకప్రసం ♦ గం బింద్రునొద్దన్ వచో
న్మానప్రౌఢిమఁ జెప్పి కొంతకలహం ♦ బుం బెంచఁ జొప్పుండఁగా
నానాభూములకేఁగ నేటికి వృథా ♦ నాకంబు చేరం జనం
గా నిట్టిప్పుడె వేళయంచు జనియెన్ ♦ గౌతూహలాభ్యున్నతిన్. 16

అ॥ కానీ — అయినను గానిమ్ము. సరేమంచిదిలే. బెదరించుటను దెలియజేయును. 'ని. గీ. కాని కానీయనంగ వికల్పమునకు, నెదుటి వాగ్విరుద్ధమునకు' ఆం. శ. ని. 'సూ. ప్రార్థనాదులయందు ఇమ్మునకు ఈవిభాషనగు' బా. వ్యా. ఉదా. ద్వి "ఆనందమునలకాంతి♦యడదెంచి కాంచి, కాని కానీ పోదు గాని లెమ్మనుచు, నట్టెపైనతిన నేల♦నొకకోలఁబూని, తలమునబిత్తరము తత్తరము పెట్టింప" అష్ట. దీనికిగాన్ — ఇందునిమిత్తమై, ఇంద్రునొద్దన్ — ఇంద్రుని సమీపమున, ఒకానొకప్రసంగంబు — యేదియో యొకప్రస్తావన, వచోన్మానప్రౌఢిమన్ — వచో — వాక్కులయొక్క, న్మాన — నిశ్చయమైన, 'ని. నూన మవశ్యం నిశ్చయే ద్వయం' అను. ప్రౌఢిమన్ — నేర్పుతో, ఈప్రౌఢిమశబ్దమునుగూర్చి ద్వి. 4 వ పద్యమునఁ జెప్పబడియున్నది. చెప్పి — బోధించి, కొంతకలహంబున్ — కొంతకయ్యమును, పెంచన్ — వృద్ధిచేయుటకు, చొప్పుండఁగాన్ — తావుండఁగా — తగినసమయముండగా, నానాభూములకున్ — అనేకస్థలములకు, 'ని. నానానేకోభయార్థయోః' అని. అ. ఏగనేటికిన్ — పోవుటయెందులకు, వృథా — వ్యర్థము, 'ని. వృథానిరర్థకావిధ్యోః' అమ. ఇచట నవ్యయప్రయోగమునుగూర్చి 'సూ. ప్రత్యయార్థావ్యయస్యాపి ప్రయోగః క్వచిద్భవేత్' అధ. దీర్ఘాంతమునుగూర్చి 'సూ అవ్యయస్యేతరస్యాపి ప్రయోగో విష్ణుశర్మణా కథితస్తద్భవస్యాపి దీర్ఘాంతత్వం క్వచిద్భవేత్' అధ. నాకంబు చేరన్ — స్వర్గంబునకు సమీపించుటకు, చనంగాన్ — పోవుటకు, ఇట్టిప్పుడె — ఇటువంటిసమయముననే, వేళ — మంచియదను, ఉచితసమయము, అంచున్ — అనుకొనుచు, కౌతూహల — కోరికయొక్క, అభ్యున్నతిన్ — అతిశయముతో, చనియెన్ — పోయెను, ఈపద్యమున ఇట్టిప్పుడె అని ప్రయోగించుటకు సూ. 'క్వచిత్ సంస్కృతీయోఽపి ప్రాణోప్యత్ర చ్యుతో భవేత్' అధ. 'ఇప్రత్యయంతావ్యయంబునకు సంధియుఁ జూపట్టెడి' ప్రౌ.వ్యా. ఉదా. 'మ. వెలి చిట్టంబుధినాథనందనులు

దోశ్శౌర్యంబు సాలించి యందఱు పొఱంగ' నిర్వ. చ. 'ప్రియముల్ సెప్పిన నన్నుఁ గైకొనక దర్పించి చిల్లు జాల్మత్వ దుర్నయశీలంబున నూరకుండితివి' శై. భా. వృథా యుత్ప్రయోగమునకు 'సూ. అన్యస్యేతరస్యాపి ప్రయోగో విష్ణుశర్మణా కథిత స్థద్భవస్యాపి దీర్ఘాంతత్వం క్వచిద్భవేత్' అథ. ఉదా......'నీవు నిది చేసినదేమి వృథా శపింతురే' స్వా. ఖ. ఇచట ద్వితీయపాదమున సమాసగతమైన 'ఊ' కారమునకును విశ్రమస్థానమునఁ గల బకారముపైనున్న ఉకారమునకును ఖండయతి చెప్ప బడియున్నది. ఉదా, జాంబవద్వీపమునందు గోవులకు ♦ నిమ్ముగ జేయుట యుం బ్రసన్నమై, అని. కావ్యాచూ, 'కానీకీనికిగా నొకానొక' అనుప్రాసాలంకారము.

తా॥ కానిమ్ము యుంటనిమిత్తమై యాసుఁ పతితో నెదియో యొక ప్రస్తావన వశంబున నా నెప్పుకొలఁగ విశదీకరించి కొంతతగవుదు బెంచుటకుఁ దావున్నదిగదా వివిధప్రదేశములఁ ద్రిమ్మరు తెలసి నిష్ప్రయోజనము. దేవలోకమున నిందుకని సభకుఁ బోవనిదెయె మంచితెరువు. అని తనలోఁ దానూహించుకొనుచుఁ గొంతతో నేగను.

వ॥ అంత నక్కాంతాతిలకం బాతనితో నిట్లనియె, 17

అ॥ అంతన్ — అంతట, అక్కాంతాతిలకంబు — చక్కనిదై యొప్పుచున్న యాయింథ, ఆతనితోన్ — ఆనిరంకుశునితో, ఇట్లనియెన్ — ఈచెప్పఁబోవువిధముగాఁ బలికెను. ఇందు 'అంతనక్కాంత' అనుప్రాసము.

—: రంభ విచారపడుట :—

ఉ॥ ఎక్కడివాఁడ వోయి యొక ♦ యింతయెఱుంగవు బుద్ధికౌశలం
బెక్కడికేగె నాలుకప ♦ యిన్నువుగింజయు నానసట్టి బ
ల్తక్కరి నారదుం డతఁడు ♦ దైవతమార్గమునందు నేగఁగా
నక్కట నన్నుఁ బేర్కొనితి ♦ వాతఁడువిన్న ననర్థమొందదే. 18

అ॥ ఓయి — ఓ బ్రాహ్మణుఁడా, ఎక్కడివాఁడవు — ఎక్కడనుండివచ్చితివి, ఒకయింత యెఱుంగవు — కొంచెమైనను దెలిసికొనలేవు, బుద్ధికౌశలంబు — మతియొక్క నేర్పరితనము, ఎక్కడికేగెన్ — ఏస్థలమునకుఁబోయెను, ఏమయ్యెను, అతఁడు — ఆముని, నాలుకపయిన్ — నాలుకమీఁద, రసజ్ఞాతలమున, నువుగింజయున్ — ఒక్కనువ్వుగింజసైతము, ఒక్కతిలబీజమైనను, నానసట్టి — నానుసంతటికాలమైనను నిదానమును గుట్టునులేని, బల్ — అధికమైన, తక్కరి — మోసగాఁడయిన తక్క + అరి — తక్కరి. ఇదిటక్కరిరూపాంతరము, నారదుండు — కలహములుపెట్టువాఁడైన నారదమహర్షి, దైవతమార్గమునందున్ — దేవతలకు సంబంధమైన యాకాశపథమునందు, ఏగఁగాన్ — పోవుచుండఁగా, అక్కట — అయ్యో, ఇది సంతాపార్థకము, నన్ను బేర్కొనితివి — నా పేరునఁబిలుచుచున్నావు, ఇచటన్ పేర్కొనెదవు, అనియైననుండవచ్చును, నాతనికిఁ దెలియునట్లునా పేరుతోఁ బిలుచుచుంటివనుట, ఆతఁడువిన్నన్ — ఆతగవులమారి ముని వినినట్లయిన, అనర్థమొందదే — కీడుగలుగదా,

ఈపద్యమున 'నన్ను బేర్కొనితివి' అనుటకు 'సూ. వర్ణాగమో విశేషః పురుషే ష్వర్థేషు చాపి వచనేషు' శబ్దచిం. నిన్నుబేర్కొనుటచే మనసుకష్టము సంభవించు ననుహేతువుచేఁ గావ్యలింగము, 'కావ్యలింగం హేతోర్వాక్య పదార్థతా' కా. ప్ర.

తా॥ ఓయీ! ఎక్కడనుండివచ్చితివి. నీవుఁ గొంచెమైనను దెలియదే నీమతియేమైనది? నాలుక మీఁద్ద నువ్వుగింజ నానునంతటి కాలమైనను నిదానము - గుట్టుసులేని మిక్కిలి మోసగాఁ డయిన నారదుఁడు దాకనుసుఁ బోవుచుండఁగా నయ్యో నాపేరుతోఁ బిలుచుచుంటివి. అతఁ డీమాట వినినట్లయిన మనకుఁ గష్టముగలుగదా.

క॥ ఆతఁడు విన్నప్పుడె పురుహూతుఁడు వినుటయును బుద్ధి ♦ నూహింపు శచీ
నేతవినెనేని వెతయగు, చేఁతయె కా తెలిసికొనుము ♦ సిద్ధముగాఁగన్. 19

అ॥ బుద్ధిన్ — నీమనసునందు, ఊహింపు — తర్కింపుము, ఇచట మువర్ణలోపమునకు 'సూ. ప్రార్థనార్థే ముకేక త్వేకథ్యయే మధ్యమార్థకః, విభాషాంతం పదం త్యక్త్వే, నప్రాణేతుకదాచన' అథ. ఆతఁడు — ఆనారదుఁడు, విన్నప్పుడె — వినినకాలముననె, పురుహూతుఁడు — ఇంద్రుఁడు, వినుటయును — ఆలకించుటయును, ఇచటఁ గ్రియాన్వయ వాక్యంబు నవ్యంగ్యముద్యోతకంబగుటకు 'సూ. క్రియాన్వయ వాక్యంబులు కొన్ని వ్యంగ్యార్థద్యోతకంబులగు' ప్రౌ. వ్యా. శచీనేత — శచీదేవికి భర్తయగు నాయింద్రుఁడు, వినెనేని — ఆకర్ణించినట్లయిన, వెతయగు చేఁతయకా. కష్టముకలుగునట్టి, పనియే కదా ఇచటను వ్యంగ్యార్థద్యోతకముకలదు. 'చేఁతయకా' అనుటకు సూ. 'అకానిత్యర్థకంబగు' ప్రౌ. వ్యా. ఉదా. అపజయముకాలక్షించి, ఖార. సిద్ధముగాఁగన్ — నిక్కముగా, తెలిసికొనుము — ఎఱుంగుము, ఇందు రంభయొక్క పరకీయనాయికాత్వము చెప్పఁబడినది. 'క. అన్యయనఁగ నన్యోఢయు' అనిచంద్రా. అని నరస. అలం. అక్రమాతిశయోక్తి "అక్రమాతిశయోక్తి స్స్యాత్ సహత్వే హేతు కార్యయోః" అనిచంద్రా. ఈపద్యమున విషాద మను భావముచెప్పఁబడినది.

తా॥ అతఁడు వినఁగానే యింద్రునకుఁ జెప్పును. ఇంద్రునిచెవిఁబడెనేని కష్టముగలుగు పనియే కదా! రూఢిగాఁ దెలిసికొనుము.

గీ॥ మనము చేసినసుకృతసంపద నతండు, వినక పోయిన బ్రదికితి ♦ మనఘవర్య
విన్నయప్పుడె యొకకీడు ♦ వెదకుఁ గాని, మానిపెట్టినతంత్రంబుఁ ♦ గానలేఁడు. 20

అ॥ అనఘవర్య — పుణ్యపురుషుఁడవైన యోనిరంకుశుఁడా, మనము — మనమిరువురము, ఇచట 'సూ. ఉభయార్థే భవేదత్వమర్థభేదేక్వచిన్నతత్' అథ. 'సూ. భూయ ఉభయార్థవాచీయః కశ్చిద్భవతి నిత్యబహువచనః తస్యజనోముశసోల' శబ్దచిం. చేసిన సుకృతసంపదన్ — పూర్వముచేసికొనిన, పుణ్యముయొక్క యతిశయముచేత, అతఁడు — ఆనారదుఁడు, వినకపోయినన్ — వినకుండవెళ్లినట్లయిన, బ్రతికితిమి — సుఖముగాజీవించుదుము, విన్నయప్పుడె — వినినకాలముననే, ఒకకీడువెదకున్ — ఒక చేటును గలుగఁజేయుటకాలోచించును, కాని — అయినప్పటికిని, మాని — ఆఋషి — పెట్టినతంత్రంతుబున్ — పన్నినయుక్తిని, 'ని. తంత్రంకుటుంబకృత్యేస్యాత్సిద్ధాంతే చౌషధోత్తమే, పరిధానేతంతు

వాయే చ శాస్త్రభేదే పరిచ్ఛదే' మే. కానలేఁడు — కనుఁగొనజాలఁడు, అనఁగా నారదుండెంతచెప్పిన నంతయే తప్పక జరుగుననుట, ఇందు 'మనయదృష్టమువలన నామహర్షి వినకుండినచో మనము బ్రతుకఁ గలము దురదృష్టవశమున నీవలు కతని చెవిఁ బడినచోఁ గష్టము తప్పదు' అనుటచే విషాదమను సంచారిభావము విస్పష్టమగుచున్నది. "విషాదశ్చేతసో భంగ ఉపాయాపాయచింతనైః" అనిప్రతా.

తా॥ మనయదృష్టము పూర్వపుణ్యాపాఫల్యంబున నతఁడు వినకుండ వెళ్లెనేని బ్రతుకఁగలము. వినిన తోడనే యొకకీడు గలిగించ బ్రయత్నించును. అయిన నీ ఋషిపన్నుగడల నాయింద్రుఁడు తెలిసికొనలేఁడు.

—: ధర్మశీలుఁడు ప్రశ్నించుట :—

క॥ ఆమాట విని యొకించుక్, భూమీపతి నవ్వి మౌని ♦ పుంగవ కరుణా
ధాముఁ డగు నారదునకే, భామామణి యింత యేల ♦ భయపడియె నొకో. 21

అ॥ ఆమాట—ఇట్లు చెప్పిన యా పులహుని వాక్యమును, విని— ఆలకించి. భూమీపతి — పుడమికిఁ బతియైన యా రాజు, ఒకించుక నవ్వి — చిఱునవ్వు నవ్వినవాఁడై, మౌనిపుంగవ — ఓ యతిశ్రేష్ఠుఁడా, కరుణాధాముఁడు — దయకు నివాసమయినవాఁడు, అగు నారదునకే — అయినట్టి నారదమునినిఁజూచిన మాత్రముననే, భామామణి — ఆరంభ, ఇంత — ఇంతగొప్పగా, ఏలభయపడియె నొకో — ఎందుకని భీతిఁజెందెనో కదా, అనఁగా నాతాపసునకుఁ గోపము లేదుగదా యింతలోనే యా రంభ యేల భయపడెననుట, ఇందు హాస మనుభావము చెప్పబడినది 'వికృతి దర్శనాదిజన్యో మనసో వికారో హాసః' ప్రతా.

వ॥ అని యడిగిన ధర్మశీలునకుఁ బులహుం డిట్లనియె. 22

అ॥ అని — ఇట్లని, అడిగిన ధర్మశీలునకున్—ప్రశ్నించిన ధర్మశీలుండను రాజునకు, పులహుఁడు— పులహుఁడను మహర్షి, ఇట్లనియెన్ — ఈప్రకారముగాఁ జెప్పెను.

—: పులహుని సమాధానము :—

సీ॥ దివిజకాంతామణి ♦ యవనీస్థలంబున, కరుదెంచు టపరాధ ♦ మౌన కాద?
అది మునుంగాక మో ♦ హావేశమున మర్త్యు, ననుభవించుట నేర ♦ మౌన కాద?
ఇంత మాత్రమె చాల ♦ కేప్రొద్దు వానికి, ననుకూల యౌటత ♦ ప్పౌన కాద?
అది కారణంబుగ ♦ నమరేంద్రు సేవకు, నరుగమి యాగడం ♦ బౌన కాద?
తే॥ చూడు మీ మెన్నివిధములఁ ♦ జూచికొన్న, రంభ యెడ దుండగమె ధరా ♦ రమణవర్య
యది యెఱిఁగి చేరాదయ్యె ♦ నమరమౌని. కొండెగానితనానకు ♦ గురువు గాన. 23

అ॥ ధరారమణవర్య — రాజులలో శ్రేష్ఠుఁడవైనవాఁడా, దివిజకాంతామణి — దేవలోకమునందుండెడి యా వేశ్య, అవనీస్థలంబునకున్ — భూలోకమునకు, అరుదెంచుట — వచ్చుట, అపరాధము—

నేరము, కానకాద — అగునా కాదా, ఇదియొక నేరమగుట, అదియునుంగాక — అంతమాత్రమే కాకుండ, మోహావేశమునన్ — మరులుకొనియెక్కువగుచుండుటవలన, మర్త్యున్ — ఒకమానవునితోఁ గూడి, అనుభవించుట — సంభోగసౌఖ్యములనుపొందుట. నేరము — తప్పు, కానకాద — అగునా కాదా, ఇంతమాత్రమె చాలక — ఈయపరాధములే కాకుండ, ఏప్రొద్దున్ — ఎల్లప్పుడును. వానికిన్ — అతనికి, అనుకూలయగుట — ఇష్టురాలగుట, తప్పు — దోషము, కానకాద — అగునా కాదా, అదికారణంబుగన్ — ఆహేతువువలన, అమరేంద్రసేవకున్ — దేవతాప్రభువగు నింద్రునిఁగొలుచుటకు, అరుగమి — పోకుండుట, ఆగడంబు — మఱితప్పు, కానకాద — అగునా కాదా, ఇచట 'ఆగడము' అనుటకుదా. "వ. అగణితగుణక్రాదావామాభిరామంబై ప్రేమాస్పదంబగుచుం గందర్పకరకంబు బిబ్బోకంబునాగడము సేయు కంధరాభోగంధర్యంబును" నార. పు. చూచుచు — పరీక్షించుచు, ఎన్నివిధములన్ — ఎన్నిరీతులచేత, చూచికొన్నన్ — పరిశీలించినను, రంభయందున్ — ఆయప్సరసయందు, దండగమె — మఱితప్పే, (కలదు — ఉన్నది,) ఇదియధ్యాహారము; అదియెఱిఁగి — ఆ నేరమును దెలిసికొని, కొండెగానితనానకుగురువుగానన్. కొండెగానితనానకున్ — చాడీలుచెప్పునటువంటికార్యమునకు, ఇచట 'కొండెగాఁడతనము' అనుటకు "సూ. తనవర్ణకంబుపరంబగునిఘుడు తచ్ఛబ్దార్థమునకు లోపంబు విభాషనగు" ప్రౌ. వ్యా. ఉదా. "క. పె. ల్లాకొన్నతనాన" భీమ. గురువుగానన్ — అధికుఁడైయుండెనుగనుక, అమరమౌనిన్ — ఆదేవర్షిని, చేరరాదయ్యెన్ — సమీపమునకుఁ గూడ రాదాయెనుగదా, ఈపద్యమంత్యానుప్రాసాలంకారము.

తా॥ దివిజకాంత యింద్రునానతిచొప్పునఁ బ్రవర్తింపక భూలోకముననే కాపురముండుటయు, నిరంతరము నీచని ప్రేమతో వర్తించుటయు, సురసభకుఁ బోకుండుటయు, నేరము లేకదా. ఆకారణముననే నారదునిఁ జూచి యంతటిభయమును బొందినది.

తే॥ భూసురప్రవర కొకనాఁడ ♦ పోయి కౌఁగి, లిచ్చి రమ్మని పంపినా ♦ డింతె కాని
సంతతము వానితోఁ గేళి♦సల్పుచునుచుఁ, బనిచెనే తన్ను లోకైక♦భర్త యైన. 24

అ॥ లోకైకభర్త. లోక — భువనములన్నిటికిని, ఏక — ముఖ్యమైన, 'ని. ఏకేముఖ్యాన్యకేవలాః' అ. భర్త — అధిపతియైనయింద్రుఁడు, ఐనన్ — ఆయినప్పటికిని, తన్నున్ — ఆరంభను, భూసురప్రవరకున్ — పుడమివేల్పైన యాప్రవరునకు, ఒకనాఁడ — ఒక్కదినమే, పోయి — అతనిదగ్గరకుఁబోయి, కౌఁగిలిచ్చిరమ్ము — ఆలింగనమొసఁగిరమ్ము, అని — ఇట్లుచెప్పి, పంపినాఁడు — అంపియుండెను, ఇంతెకాని — ఈమాత్రమే కాని, సంతతమున్ — ఎల్లప్పుడును, వానితోడన్ — ఆబ్రాహ్మణునితో, కేళిసల్పుచునుచున్ — సంభోగించుచుండుమని, పనిచెనే — పంపించినాఁడా.

క॥ ఈమాటలు ముని దివిజ, స్వామికి వినిపించెనేని ♦ జననాథ యతం
డేమనిశాసించునో యని, యామానిని యతని కంత ♦ యలికెం జుమ్మీ. 25

అ॥ జననాథ — ఓరాజా, ముని — ఆనారదుఁడు, ఈమాటలు — ఇచ్చటజరిగిన సంభాషణ యొక్కతీరును, దివిజస్వామికిన్ — దేవతాప్రభువగు నింద్రునకు, వినిపించెనేని — చెప్పినట్లయిన,

అతండు — ఆయింద్రుండు, ఏమనిశాపించునో — ఏవిధముగ నాజ్ఞాపించునోకదా. ఇచట 'ఏమని' అనుటకు 'సూ. ఏమ్యాదులయిత్తునకు సంధి వైకల్పికముగానగు' బా. వ్యా అని — ఇట్లు తలంచి, ఆ మానిని - ఆమానవతి, అతనికిన్ - ఆనారదునకు, అంత - అంతయధికముగా, అలికెంజుమ్మా - భయపడెనుసుమా.

—: నారదుండింద్రసభకుం జేరుట :—

వ॥ ఇదియిట్లుండె నట నారదుండు చని యెదుట హాహా హూహూ ముఖ్య విఖ్యాతగాయన గేయ నవీనమాధురీ ఝరీతరంగనినదాయమాన మేనకాద్యప్సరః పాత్ర విచిత్రకంకణ ఝణత్కారచామీకర మేఖలాకింకిణీ ఘుళఘుళనూపుర కలకలధ్వనులచే సంతసించుచు సంతతవందమానత్రయస్త్రింశత్కోటిదేవతా సంసేవ్యమానుండై రత్న సింహాసనంబున నాసీనుండై యున్న సహస్రలోచనుం గాంచి నిలిచిన. 26

అ॥ ఇది - ఈవృత్తాంతము, ఇట్లుండెన్ - ఇటుండనిమ్ము, అట- అక్కడనుంచి, నారదుండు- ఆనారదమహర్షి చని- పోయి, ఎదుటన్-తనయెదుట, హాహా.....ధ్వనులచే-హాహా...... హూహూ-హాహాహూహూవులను పేరుగల, ముఖ్య - గంధర్వ ప్రముఖులలో, విఖ్యాత - ప్రసిద్ధిగల, గాయన సంగీతమును బాడునట్టి పురుషులయొక్క, గేయ - పాట, నవీన - నూతనమైన, మాధురీ - మాధుర్యమనెడు, ఝరీ - ప్రవాహముయొక్క తరంగ - అలలతోడి, నినదాయమాన - ధ్వనించుచున్న, మేనకాది - మేనక మొదలగు, అప్సరః - దేవవేశ్యలలో అప్సరః, నీళ్లనుండి లేచినవారు అనివ్యు. "అప్సు నిర్మథనాదేవరసాత్తస్మాద్వరస్త్రియః ఉత్పేతుర్మనుజశ్రేష్ఠ తస్మాదప్సరసోఽభవన్" పాత్ర - నాట్యమాడెడుస్త్రీలయొక్క, విచిత్ర - చోద్యమైన, కంకణ - హస్తాభరణములయొక్క, ఝణఝణత్కార - ఝణఝణయని మ్రోగుచున్నట్టియు, చామీకర - సువర్ణమయమైనమేఖలా - మొలనూలుయొక్కయు, కింకిణీ - చిఱుగంటలయొక్కయు, ఘుళఘుళ - ఘుళఘుళయనెడు, నూపుర-కాలియందెలయొక్కయు, కలకలధ్వనులచేన్- కోలాహలారావములచేత అనఁగా బహువిధములగు నినాదములచే ననుట, సంతసించుచున్ - సంతోషపడుచు, సంతత.....మానుండై, సంతత- ఎడతెగని, వందమాన- నమస్కరించుచున్న, త్రయస్త్రింశత్కోటి - ముప్పదిమూడుకోట్ల, దేవతా - దేవతలచేత, సంసేవ్యమానుండై - కొలువబడుచున్నవాఁడై, రత్నసింహాసనంబునన్- దేవలోకమునఁగలమణులతో నిర్మింపఁబడిన రాజపీఠమునందు, సింహాసనమనగా సింహముఖమేర్పఱచియుండు కనకమయమగు నున్నతపీఠము. ఆసీనుండై - కూర్చున్నవాఁడై, ఉన్న సహస్రలోచనున్ — ఉండిన, వేయికన్నులుగల యాయింద్రుని, కాంచి - వీక్షించి, నిలిచినన్- నిలఁబడఁగా, 'ముఖ్యవిఖ్యాత-గాయనగేయన-మాధురీఝరీ-పాత్రవిచిత్ర-కంకణఝణఝణ ఇత్యాదులనుప్రాసాలంకారము.

తా॥ దీనినిట్లుండనిమ్ము. అచ్చటినుండి కలహభోజనుం డరిగి తనయెదుట హాహాహూహూవులనెడు గంధర్వప్రముఖులలోఁ బ్రసిద్ధికెక్కిన సంగీతవిద్యాధికులయొక్క గానమునందలి మాధుర్యమనెడు ప్రవాహముయొక్క యలలతోఁగూడి ధ్వనించుచున్న మేనక మొదలగు దివిజవేశ్యలలో నర్తకియొక్క వింతయైన హస్తాభరణములయందలి ఝణఝణ యనుమ్రోఁతయొక్కయు,నపరంజి మొలనూళ్లు

యొక్కయు, జిలుగుటలయొక్కయు ఘళఘళయనెడు కాలియందెలయొక్కయు మిశ్రశబ్దములచేత నానందమునొందుచు ననిశము నమస్కరించుచున్న ముప్పదిమూడుకోట్ల దేవతలచేఁ గొలువఁబడుచు దివ్యమణులతో రచింపఁబడిన రాజపీఠమునందుఁ గూర్చుండిన వేయికన్నులవానిం గాంచి నిలువంబడఁగా.

—: ఇంద్రుఁడు నారదుని సమాచారములడుగుట :—

క॥ మునినాథుఁ గాంచి సురపతి, ప్రణుతసమారాధనార్ఘ్య ♦ పాద్యాదివిధు
ల్వినయముగ నొసఁగి యర్హాసనమునఁ గూర్చుండ నునిచి ♦ సలలితబుద్ధిన్. 27

అ॥ సురపతి - ఆదేవతాప్రభువు, మునినాథున్ - మునులలోశ్రేష్ఠుఁడగు నారదుని, కాంచి - వీక్షించి, సలలితబుద్ధిన్ - ప్రకాశించుచున్న తెలివితో, ప్రణుత......విధుల్, ప్రణుత - స్తోత్రము చేయఁబడిన, సమారాధన - పూజించుటయును, అర్ఘ్య - పూజాద్రవ్యమును, పాద్య - పాదోదకమును, ఆది - మొదలుగాఁగల విధుల్ - విధానములను, చేయుటలను, వినయముగన్ - నీతితో, ఒసంగి - ఇచ్చి, అర్హాసనమునన్, అర్హ - ఉచితమైన, ఆసనమునన్ - పీఠమునందు, కూర్చుండనునిచి - ఉపవిష్టుఁ డగునట్లుచేసి,

తా॥ దివస్పతి యమ్మునిశ్రేష్ఠునిఁజూచి తనబుద్ధికుశలత దీపింపఁ బూజాద్రవ్యమును బాదోదకము నిడి తగినపీఠమునందు గూర్చుండఁజేసి.

క॥ మునియనుమతిఁ దానుచితా, సనమునఁ గూర్చుండి సత్ప్ర ♦ సంగంబున నో
యనఘాత్మ యెచటి కరుగుచుఁ, జనుదెంచితి రిటకు నాదు ♦ జన్మఫలమునన్! 28

అ॥ మునియనుమతిన్ - ఆనారదునియొక్కసమ్మతితో, తాన్ - ఆయింద్రుఁడును, ఉచితాసనమునన్ - తనకర్హతగల సింహాసనమున, కూర్చుండి - ఆసీనుఁడై, సత్ప్రసంగంబున్ - మంచిప్రస్తావనతో, ఓయనఘాత్మ - ఓపుణ్యపురుషుఁడా, ఎచటికరుగుచున్ - ఎచ్చోటికి బోవుచు, నాదుజన్మఫలమునన్ - నాయొక్కజననకాల శుభప్రాప్తివలన, ఇటకున్ - ఇచ్చటికి, చనుదెంచితిరి - వచ్చితిరి, ఈ బహువచనప్రయోగమునకు "స్యాత్పూజ్యత్వే వివక్షాయాం మహతాం బహుతామతా" అని యథ. ఇచట ప్రస్తావనవశమున నారదునడుగుటయు నాతఁడు రంభయొక్క కృత్యములను జెప్పుటయును యుక్తియుక్తమే 'సూతాః పౌరాణికాః ప్రోక్తా మాగధా వంశశంసకాః, వందిన స్త్వమలప్రజ్ఞాః ప్రస్తావసదృశోక్తయః' అనిశాస్త్రము. 'మునియనుమతితానుచితా' అనుప్రాసాలంకరము.

తా॥ ఆసంయమిసమ్మతితోఁ దానును దనసింహాసనమునఁ గూర్చుండి మంచిప్రసంగసందర్భమున నోపుణ్యాత్మా! ఎచ్చటికేఁజనుచు నాయదృష్టవశమున నిటకుదయచేసితిరి?

—: నారదుఁడు రంభనేరములఁజెప్పుట :—

క॥ అనవిని ముని దరహసితా, ననమున సురలోకనాథ ♦ నానాదిశలం
జని భువిని జిత్రమొక్కటి, గని వచ్చితి మీకుఁ దెలుపఁ ♦ గాఁ బనిగలనై. 29

అ॥ అనన్ - ఇట్లుపలుకఁగా, విని - ఆకర్ణించి, ముని - ఆనారదుఁడు, దరహసిత - చిఱునవ్వుతోఁగూడిన, ఆననమునన్ - ముఖముతో, సురలోకనాథ - ఓస్వర్గాధిపతీ, నానాదిశలన్ - అనేకదిక్కులకు, చని - పోయినవాఁడనై చిత్రము - ఆశ్చర్యము, ఒక్కటి - ఒకటి, కని - చూచి, మీకుఁదెలుపఁగాన్ - దానిని మీకుఁజెప్పుటకు, పనిగలనై - కార్యముగలవాఁడనై, వచ్చితిన్ - ఏతెంచితిని, నారదుఁడు కలహములను బెట్టువాఁడగుటయేకాక యింద్రుని ప్రసంగవశమయినప్రశ్న యును 'హేతువేయయినని, 'అన. విని. ముని' అనుప్రాసాలంకారము.

తా॥ అన విని నారదుఁడు మందహాసముతో నోత్రివిష్టపాధిపతీ నే నన్నిదిశలయందు సంచరించి యొకచిత్రము చూచి దానిని మీకుఁజెప్పఁ బనిగలిగి వచ్చితి.

క॥ మునినాథ యేమిచిత్రము, గనుఁగొంటివో యానతీయఁ ♦ గదవే యనిన
న్వినవోయి నముచిసూదన, యనిమిషతరుణీలలామ ♦ యవనీస్థలిలోన్. 30

అ॥ మునినాథ - ఋషిశ్రేష్ఠుఁడవగు నోనారదుఁడా, ఏమిచిత్రము - ఏమిచోద్యము, కనుఁగొంటివో - చూచియున్నావో, ఆనతీయ గదవే - సెలవియ్యఁగదవయ్యా, అనినన్ - ఇట్లువచింపఁగా, నముచిసూదన - నముచియను రాక్షసునిఁజంపిన యోయింద్రుఁడా, వినవోయి - నేఁజెప్పు వృత్తాంతము నాకర్ణింపుము, అనిమిషతరుణీలలామ - దేవవేశ్యలలో యోగ్యవతి యగునారంభ, అవనీస్థలిలోన్ - భూమియందొకచోట, పైపద్యముతో నన్వయము. ఈపద్యమున 'నానతీయఁ గదవే' అనుటకు "ప్రార్థనార్థే భవేన్నాంతాత్కదేత్యర్థ విశేషదః" అధ.

తా॥ ఓమునీంద్రా నీవు కనుఁగొనిన వింతయేదియో సెలవిమ్మనఁగా సుత్రామావినుము. రంభ యను నప్సరోంగన భూలోకమునం దొకచోట.

క॥ అలనాఁటనుండి ద్విజుఁడం, గలుగొని యిటు రాక యుండెఁ ♦ గా దానికి నా
యిలవేల్పే యిలువేలుపు, బలభేదన యేమిచెప్పఁ ♦ బనియున్న దిఁకన్. 31

అ॥ బలభేదన - బలాసురుని సంహరించినవాఁడా, అలనాఁటనుండి - శివునియానతి ననుసరించి నీవురంభకాజ్ఞయొసంగిన దినమునుండియు, ఇచట 'అల' దేశ్యము ప్రసిద్ధిని దెలుపునది. 'అల్ల' అనియు రూపముకలదు. ద్విజునిన్ - ఆబ్రాహ్మణుని, కలగొని - లోఁగొని, ఇటు - ఇక్కడికి, ఇదిదేశ్యము. రాకయుండెఁగా - రాకయున్నదిగదా, దానికిన్ - ఆయొక్కరంభకు, ఆ ఇలవేల్పే - ఆబ్రాహ్మణుఁడే, ఇలవేలుపు - గృహదైవము, ఇంటియందు నిత్యమును బూజించుదేవుఁడు ఉదా. "ఉ. ప్రమదవిలాస నర్తనవి♦భాసుర గోపకిశోరమూర్తితోఁ ,దమ కిలువేలుపై వెలయు♦తాండవకృష్ణ పదాబ్జసేవ" కళా. ఇఁకన్ - ఇఁకమీఁద, ఈచెప్పినదానికంటెననుట, ఏమిచెప్పబడియున్నది - నేఁ జెప్పవలసిన పనియేమికలదు, సమస్తమునీకే తెలియుననుట, ఈ ద్యమున 'నాయిలవేల్పే యిలువేలుపు' అనుప్రాసాలంకారము.

తా॥ ఓబలవైరీ శివునాజ్ఞననుసరించి నీవు రంభకు సెలవిచ్చిననాఁటనుండి యాబ్రాహ్మణుని దనవశపఱచుకొని స్వర్గమునకే రాకుండెనుగదా! దాని కతఁడే యింటిదేవతయైనాఁడు; ఇఁకనే నేఁజెప్ప వలసిన దేమున్నది?

క॥ సురతనయుల సంభోగము, నిరసింపగ వింటి దాని ♦ నేరంబునకై
సురనాథ నిన్నయనవలెఁ, బరిపాలన మిట్లుచేయఁ ♦ బఱపితి వనుచున్. 32

అ॥ సురనాథ — ఓయింద్రుఁడా, సురతనయులసంభోగమున్ — దేవతలకుమారులైనయావనుల యొక్క సంభోగమునందు నీతిగలవారియొక్క రతికేళిని, నిరసింపఁగన్ — తిరస్కారముచేయఁగా, వింటిన్ — నేనువినియున్నాను, దానినేరంబునకు + ఐ — ఆబిడయొక్క దుష్టస్వభావముకొఱకుగాను, ఇట్లు — ఈప్రకారముగ, పరిపాలనము — ఈస్వర్గమును గాపాడునట్టి కార్యమును, చేయన్ — చేయుటకు, పఱపితివి — పొంపించితివి, అనుచున్ — ఇట్లుపలుకుచు, నిన్నయనవలెన్ — నిన్నేనిందించవలయునుసుమా, ఇచటఁ బరిపాలనాలోపము నీయదియే కాని దానివల్ల నేమికల దనుటచే వ్యాజస్తుత్యలంకారము. "వ్యాజ స్తుతిర్ముఖే నిందాస్తుతిర్వా రూఢి రన్యథా" కా. ప్ర. ఉదా. "క. అసమరణరంగములనీ, యసినటినటియింప గరుల+హయులన్ విరులన్, వెసనొసఁగు నౌర యెంతటి, రసికుఁడు నీవైరి యోబరాజనృసింహా" కా. సం. "హే హేలాజితబోధిసత్త్వ వచసాం కింవిస్తరైస్తోయధే నాస్తి త్వత్సదృశః పరః పరహితాధానే గృహీతవ్రతః, తృష్యత్పాంథజనోపకారఘటనావైముఖ్యలబ్ధాయశో, భారప్రోద్వహనే కరోషి కృపయాసాహాయ్యకం యన్మరోః" పుంజ.

తా॥ ఆబిడ సంభోగవిద్యయం దారితేరిన దివిజకుమారులసైతము నిందింపఁగా నేను వింటిని. దాని నేమిచేయఁగలము. స్వర్గపరిపాలన మిట్లున్నందులకు నిన్నే తెగడవలయును.

గీ॥ కాన నీభోగసంపద♦ ఘనము లిచటి, సొంపుపెంపును రంభకు♦ నింపుపుట్ట, దనచుఁ
దోఁచుచున్నదో♦ యనిమిషేంద్ర, మానవులమీఁదియధికస♦మ్మతముఁ జూచి 33

అ॥ ఓయనిమిషేంద్ర — సురపతివగు నోయింద్రుఁడా, ఆపెకు, మానవులమీఁది — నరులపైని, అధికసమ్మతమున్ — ఎక్కువైనయిష్టమును, చూచి — కనుగొంటిని, కానన్ — కనుక, ఉదా. 'సీ. కానఁబద్మహితుఁడు ఘనప్రకాలంబున' వి॰ పు. నీభోగసంపదఘనములు, నీ — నీయొక్క, భోగ — సుఖముయొక్కయు, సంపద — కలిమియొక్కయు, ఘనములు — గొప్పతనములు, ఇచటి సొంపుపెంపు ఇచటి — ఈప్రదేశమునగల, సొంపు — యోగ్యతయొక్క, పెంపు — సమృద్ధి, రంభకున్ — దేవదాసియగు నాయొక్కరంభకు, ఇంపు పుట్టదనుచున్ — ఆనందము కలిగించుటలేదని, తోఁచుచున్నది — నాకుస్ఫురించుచున్నది. 'సొంపు పెంపు ఇంపు' అనుప్రాసాలంకారము.

తా॥ దానికి మానవులమీఁది మిక్కుటమైన యనురాగమును జూచి నీభోగసంపద్వృద్ధులారంభకేమాత్రమును సంతోషమును గలిగించుట లేదని నాకు విదిత మగుచున్నది.

చ॥ మననలకూబరాదు లవ♦ మానము నొందెద రంచు నాడె నో
యనిమిషలోకనాథ యది♦ యాధరణీసురపుత్త్రితోడ నా
డినవచనంబులెల్లఁ బ్రక♦ టింపను నట్టివిబైటఁబెట్టఁగా
మునులకు నాకు నేల విను♦ మోహముగా కది దానిపాపమే. 34

అ॥ ఓయనిమిషలోకనాథ — స్వర్గాధిపతివగు నోయింద్రుఁడా, విను — ఆకర్ణింపుము, అది — ఆయొక్క రంభ, ధరణీసురపుత్త్రుతోడన్ — బ్రాహ్మణునికొడుకైన యానిరంకుశునితో, మానసలకూబరాదులు — మనస్వర్గమునందున్న నలకూబరుఁడు మున్నగాఁగలవారు, అవమానమున్ — పరాభవమును, ఒందెదరంచున్ — పొందెదరనుచు, ఆడెన్ — పలికెను, ఆడినంచునుబులెల్లన్ — అదియతనితోఁ జెప్పిన మాటలన్నియు, ప్రకటింపన్ — స్పష్టపఱచుటకును, అట్టిని — ఆరాటిని, బైటఁబెట్టఁగన్ — బహిరంగము చేయుటకును, మునులకున్ — ఋషులకు, మాకున్ — మావంటివారికి, అనఁగా ఋషుల మైనమామువంటివారికి, ఏల — ఎందుకని, అక్కఱలేదనుట, అది — అట్టిసరిపన్నిన, మోహముగాక — వలపుగాక, దానిపాపమే — దానిదోషమా, అనఁగా వానియందావిధమగు మనుకారము సటుల జరిగినది. గాని పాపము దానిదనుటవలన నేమిప్రయోజనమనుట, ఇందు మూఁడవపాదమున వర్ణజయతి చెప్పఁబడినది. క. తద్గతము యమునాదికవర్ణములు విడిచి వెనుక విపులు నాల్గుపదములలోఁ, దమకు నర లేక నిలిచిన నమరాహిత దమవర్గయతులనఁబరగున్. అన్న. 'అదిమోహముగాక దానిపాపమా' యనుటచేత అలంకారము వ్యాజనింద. 'నిందాయానింద యావ్యక్తిర్వ్యాజనిందేతి గీయతే విశేష నిందోద్యయస్తే ప్రోగేకమేవాహరచ్చిరః' అని కువ.

తా॥ ఓ స్వర్గప్రభూ విన్నావా మననలకూబరాది యౌవను లాబ్రాహ్మణకుమారునకు సరిరాక యవమానమును బొందుదురనెను. అది పలికినపలుకులెల్లఁ దేటపఱచుటకును బైటఁబెట్టుటకును ఋషుల మగు మావంటివారికి దులకు? అదియంతయు మనుకారముగాని దానినన్నందువలనఁబ్రయోజనమేమి?

—: ఇంద్రుఁడు రంభపై నాగ్రహించుట :—

చ॥ అన విని వజ్రి మండిపడి ♦ యౌను నిజ నారద యద్దురాత్మురా
లనిమిషలోకభోగభర ♦ మల్పముగాఁ దలపోయుకున్న న
మ్మనుజుని బాయకున్నె బళి ♦ మంచిది దానికి నేన గర్వముం
బెనిచితి నిన్నినాళ్లు నిఁకఁ ♦ బెద్దతికం బొకయింత కుంచెదన్ 35

అ॥ అనన్ — ఇట్లువచించఁగా, విని — ఆకర్ణించినవాఁడై, వజ్రి — వజ్రమే యాయుధముగా గల యాయింద్రుడు 'ని. వజ్రంత్వస్త్రీకులిశశస్త్రయోః మణివేధేరత్నభేదే" కేశవ. 'వజ్రపాణిర్మహేంద్రః సురగ్రామణీర్యామనేమిర్వృషానాకనాథోహరిః' త్రి. శే. మండిపండి — కోపముయొక్క యధికముగలవాఁడై, నారద — ఓనారదమహర్షీ, ఔనవున్ — అవునవును, నీవుచెప్పినది సత్యమే యని త్వరితముగాఁజెప్పుట. ఉదా. శా. ఔనౌనే వెలయాల' దశా. చ. అద్దురాత్మురాలు — దురాత్మురాలైన యాయొక్క రంభ, అనిమిషలోకభోగభరమున్ — అనిమిషలోక — స్వర్గమునఁగల, భోగ — ఆనందముయొక్క, భరమున్ — అధికమును, అల్పముగాన్ — అణుమాత్రముగా — కొంచెముగా, తలపోయకున్నన్ — ఎంచకుండినట్లయిన, అమ్మనుజునిన్ — ఆమానవుని, పాయకున్నె — విడువకుండునా, బళి — మెచ్చుట. మంచిది — సరియేకానిమ్ము, అనఁగా దానిపని కనుగొనియెదననికోపముతో నంగీకరించుట, దానికిన్ — ఆయచ్చరకు, నేన — నేనే, ఇన్నినాళ్ళు — ఇంతకాలమువఱకు, గర్వమున్ — అహంకారమును, ని. 'గర్వోఽభిమానోఽహంకారో చిత్తోద్రేకస్మయోమదః' అని అ.

